# ఆంధ్రపత్రిక



THE ANDHRA PATRIKA- MADRAS. సంపుటం 43. సంచిక 22 FOUNDER DESODHARAKA K. NAGESWARA RAO సోమవారం 23-4-1956 Reg. No. M. 1118. 6 పేజీలు 1 అణా

# అన్నిరకాల ఆస్తులపైనా పరిమితులు విధించడం అసాధ్యం

## స్టాలిన్‌ను తెగనాడినా నియంతృత్వం పోలేదు

### రష్యా విధానాలు మారలేదని అమెరికా అధ్యక్షుని విమర్శ

వాషింగ్టన్, ఏప్రిల్ 21: స్టాలిన్‌ను తెగనాడినా, సమిష్టి నాయకత్వాన్ని రష్యా నాయకులు సమర్థించుకున్నా, అక్కడ నియంతృత్వం మాత్రం ఇంకా పోనేలేదనీ, స్టాలిన్ అనుసరించిన విదేశాంగ విధానాన్ని కూడా సోవియట్ ప్రభుత్వం మార్చుకోలేదనీ, రష్యాలో ఇంకా పౌరులకు ప్రాథమిక రక్షణ లింకా లేనేలేవనీ అమెరికా అధ్యక్షుడు ఐసెన్‌హోవర్ అన్నారు.

అమెరికన్ వార్తా పత్రికా సంపాదకుల సభలో అమెరికా విదేశాంగ విధానాన్ని శ్రీ ఐసెన్‌హోవర్ నిర్దేశించారు.

"స్థిరంగా శాశ్వతంగా నిలబగల సత్సంబంధాలను స్థాపించుకోవాలనే కోరిక సోవియట్ పరిపాలకులకు ఉన్నదో లేదో ఖండితంగా చెప్పడం ఇప్పుడప్పుడే కష్టం. ఇంతవరకూ జరిగిన మార్పులెన్ని ఉన్నా స్టాలిన్ విదేశాంగ విధానం చాలవరకు యథాతథంగానే అనుసరిస్తున్నారు" అని శ్రీ ఐసెన్‌హోవర్ అన్నారు.

"యుద్ధానంతర ప్రపంచాన్ని బాధిస్తున్న పెద్ద అంతర్జాతీయ సమస్యలింకా పరిష్కారం కాలేదు. స్వేచ్ఛకల దేశాలు అప్రమత్తత కొంత విరమించాలంటే, సోవియట్ విధానాలలో ప్రాథమికమైన మార్పులింకా రావాలి.

"చచ్చిపోయిన స్టాలిన్ నాయకత్వంలో వచ్చిన చిక్కులమూలంగా కొత్త పరిపాలకులు అటిడి కొన్ని దోషాలను సరిదిద్దుకోక తప్పనిసరి వచ్చి ఉంటుంది. ఏక వ్యక్తి నిరంకుశ పరిపాలన అనుభవించినందువలన కొత్త పాలకులు సమిష్టి నాయకత్వాన్ని ప్రతిపాదించారు. అయినా అది నియంతృత్వంగానే ఉండిపోయింది. స్టాలిన్ క్రూర పరిపాలనలో జరిగిన దురంతాలలో మరీ ఘోరమైన వాటిని వీరు తెగనాడుతున్నారు. కాని అక్కడ పౌరులకు స్వేచ్ఛా సమాజంలో లభించే ప్రాథమిక రక్షణ లింకా లభించడం లేదు.

"ఇతర దేశాలపై స్టాలిన్ జరిపిన దోషాలు ఇంకా అటిడే వారసుల అధికారంలో సాగుతూనే ఉన్నాయి" అని శ్రీ ఐసెన్‌హోవర్ అన్నారు. ఈ సందర్భంలో జర్మనీదేశ విభజన, జర్మనీ అంతటా ఎన్నికలు స్వేచ్ఛగా జరగాలంటే వీటో ద్వారా రష్యా నిరాకరణ, ...

## స్వాతంత్ర్య పోరాటానికి అమెరికా త్రివిధ లక్ష్యాలు

...

6 వ పేజీ 1 వ కాలం చూడుడు

## పరిహారాల చెల్లింపులకే ధనం వృథా అవుతుందని శ్రీ దేశముఖ్ వివరణ

### ప్రస్తుతం భూకమతాలకు మాత్రమే గరిష్ఠ ప్రమాణం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 21: ప్రస్తుతానికి భూవసతిపై మాత్రమే గరిష్ఠ ప్రమాణాలు నిర్ణయించటం సాధ్యమనీ, అన్నిరకాల ఆస్తులకూ ఈ రకంగా ప్రమాణాలు నిర్ణయించి రాబడి పరిమితం చెయ్యాలంటే, అందుకు తగ్గట్టు పరిహారాలు ఇచ్చుకోవాలి కాబట్టి, కనిష్ఠ ప్రమాణ నిర్ణయం వీలుకాదని ఆర్థిక మంత్రి శ్రీ దేశముఖ్ అన్నారు.

ప్రణాళికకు ధనం సమకూర్చుకోవడానికి, పన్నుల విచారణ సంఘం సూచించిన మేరకేకాక, కొత్త కొత్త పన్నులు కూడా విధించడం జరుగవచ్చునని ఆర్థిక మంత్రి స్పష్టం చేశారు. అనేకులు చేసే సూచనలను పరిశీలిస్తూ ఉంటామని అంటూ ముఖ్యంగా "ఖర్చుమీద పన్ను విధించడం" వాటిలో ఒకటి అని ఆయన అన్నారు.

అసలు కమతాలకు గరిష్ఠ ప్రమాణాలు నిర్ణయించడం ఆశేది, రాబడులు పరిమితం చేయడానికి ప్రధాన మార్గం అనుకోవరాదని, ఉత్పత్తి సాధకం కొద్దిమంది చేతులలో గుత్తగా ఉండిపోకుండా చేయడమే ఇందులో గర్భితమై ఉన్న ముఖ్య లక్ష్యమనీ శ్రీ దేశముఖ్ వివరించారు.

ఇలాగా తమకు తోచే, ఇతరులు సూచించే కొత్త మార్గాలన్నిటినీ పరిశీలిస్తూ, వాటిలో సాధక బాధకాలు ప్రయోజనాలూ చేకూర్చే వేస్తూ, యోగ్యం అయిన వాటిని శాసనాలు చేస్తూ ఉంటామన్నారు. మొత్తంమీద రాబడులలోనూ, సంపదలలోనూ దేశవ్యాప్తంగా ఉన్న తేడాలు తగ్గించడానికి గట్టిగా కృషి జరగాలనీ, ఈ విషయంలో జాప్యం జరగరాదనీ శ్రీ దేశముఖ్ అన్నారు.

మాట వరసకే, సంపదలపై పన్ను విధించడం ఒక మార్గం దీన్నిగురించి ఆలోచిస్తున్నాం. ఇందులో ఎన్నో చిక్కులు ఉన్నాయి. అందువల్ల ఇది ఏనాటికి కార్యరూపం దాల్చేదీ చెప్పడం సాధ్యం కాదు" అని ఆయన అన్నారు.

### బడ్జెట్‌పై చర్చ సమాప్తి

ఆర్థిక మంత్రి ప్రసంగం అనంతరం లోక్‌సభ బడ్జెట్ ... ఉభయ సభల ప్రత్యేక సంఘం పరిశీలనకు పంపబోతూ ప్రభుత్వం చేసే ప్రతిపాదన సోమవారం నాడు చర్చకు వస్తుంది.

ఇతఃపూర్వం, ఆర్థిక మంత్రి బడ్జెట్‌లో ప్రతిపాదించిన పన్నులు కొన్ని తగ్గిస్తూ చేసిన నిర్ణయాలు ఆర్థిక బిల్లులో చేర్చారు. ఈ తగ్గింపులవల్ల రాబడిలో తగ్గేది మొత్తంమీద, మహా అయితే రు. 50 లక్షలకు మించదు అని ఆయన తెలియచేశారు. డీసెల్ నూనెపై పన్ను విషయంలో, రైతులపై భారం ...

తగ్గించే విషయమై ప్రభుత్వం ఇంకా ఆలోచిస్తున్నదనీ, దీనికేదో ఒక మార్గం దొరక్కపోయినా, మొత్తానికి తమ నిర్ణయాలను అమలు జరుపడానికి తగు అధికారాలు ప్రభుత్వానికి ఉన్నవనీ కూడా ఆయన అన్నారు.

### సగం తగ్గించినా ఎగవేస్తారు!

రాబడి పన్నుల ఎగవేత వ్యవహారం ప్రస్తావనకు వచ్చిన సందర్భంలో, ఎవిమిటేదేశ్యవాటి రాబడిపన్ను వివాదాలను తిరుగతోడడానికి ప్రభుత్వం అధికారం స్వీకరిస్తున్నా, దగాకోరు వ్యవహారాలను బయటకు తేవడానికే ఈ అధికారాలను వినియోగిస్తారని ఆర్థిక మంత్రి హామీ ఇచ్చారు. అటువంటి సందర్భాలలో కూడా, ఆయా వ్యక్తులు చెప్పుకోదలచిన సంజాయిషీలను, వారి వాదాలను కూడా విచారించాలని శ్రీ సి. డి. పాండే చేసిన సూచనగురించి ఆలోచిస్తామని కూడా మంత్రి చెప్పారు.

అసలు పన్నులు ఎక్కువగా ఉండబట్టే, ఎగవేసే ప్రయత్నాలు జరుగుతున్నవన్న భావాన్ని ఆర్థిక మంత్రి ఖండించారు. మన దేశంలో పన్నుల ప్రమాణాలు బ్రిటన్‌లో స్థాయికి దాదాపు సమానం అని ఈ సందర్భంలో అన్నారు. ఏదేలా ఉన్నా, ఇపుడు విధిస్తూన్న పన్నులను సగానికి ...

### కమతాలపై గరిష్ఠ ప్రమాణాలు

చర్చ సందర్భంలో భూమితో పాటు, అన్ని రకాల ఆస్తులకూ గరిష్ఠ ప్రమాణాలు ఎందుకు నిర్ణయించరాదని కొందరు సభ్యులు ప్రశ్నించారు. "భూమి తరహా వేరు. జనభా ఎంతో ఉన్న ఈ దేశంలో భూమికోసం అందరూ ప్రయత్నిస్తారు. అందువల్ల ఉత్పత్తి సాధకాలలో ఇది అరుదు అయినదిగా అనిపించు కొంటుంది. పరిమిత-స్వభావం కాగలది. గ్రామీణ వ్యవస్థలో ఆర్థిక, ...

6 వ పేజీ 6 వ కాలం చూడుడు

"ఉపసంఘాన్ని వేస్తే సమస్య పరిష్కారమై పోయినట్లే!" అని లోక్ సభలో ఆర్థిక మంత్రి ఆక్షేపించారు. తీరా ఈ ఉపసంఘాలు గంటలు వృథాచేసి, మినిట్స్ పుస్తకాలు వ్రాస్తాయి' అని కూడా శ్రీ దేశముఖ్ అన్నారు.

## భారత అభివృద్ధికి ముఖ్య అవరోధాలు కులమత ప్రాంతీయ తత్వాలు మాత్రమే

### శ్రీ నెహ్రూ హెచ్చరిక: సోషలిస్టు సమాజ సాధన యాత్రలో మొదటి మజిలీ దాటినందుకు ఆనందం

ముజఫర్‌పూర్, ఏప్రిల్ 21: "సోషలిస్టు సమాజ సాధన యాత్రలో మొదటి మజిలీ దాటాము. మిగతా మజిలీలనుకూడా నిర్నిరోధంగా దాటి, గమ్యస్థానం చేరుకుంటాము. సందేహంలేదు. మనకు బయటనుంచి ఏవో అవరోధాలు సంప్రాప్తిస్తాయనేది అప్రస్తుతం. మనం మనలో మనకుగల విభేదాల మూలంగానే గతంలో దేశానికి కీడు కలిగించాము. మనకున్న అవరోధాలు, కులతత్వం, మత ద్వేషాలు, ప్రాంతీయ తత్వాలు మాత్రమే" అని శ్రీ జవహర్లాల్ నెహ్రూ తిర్హూట్ ఇంజనీరింగ్ కళాశాలకు శంకుస్థాపన చేస్తూ హెచ్చరించారు. మూడు లక్షలమంది ప్రజలు ప్రధాని హెచ్చరికను శ్రద్ధతో విన్నారు—హర్షధ్వానాలు చేశారు.

భాషా రాష్ట్రాల పేరిట అక్కడక్కడా జరుగుతున్న దుశ్చర్యలను ఆందోళనలను నిరశిస్తూ శ్రీ నెహ్రూ ఇలా అన్నారు: ఇలాటి చర్యలు ప్రజాస్వామిక తత్వానికి విరుద్ధం; చాలా ప్రమాదకరమైనవి. ఒక గ్రామమూ, ఒక పట్టణమూ ఇటో అటో చేరినంతమాత్రాన ఆ రాష్ట్రానికి ఏదో నష్టం కలిగిందని వాపోవడం అర్థరహితమైనపని. రాష్ట్రాలు పరిపాలనా సౌలభ్యంకోసం ముఖ్యంగా ఏర్పడుతాయి. దేశం అంటే ఏ ఒక్క రాష్ట్రమూ కాదు. తను ఉంటే రాష్ట్రమే దేశమంతానని అనుకోవడం పొరబాటు."

"ప్రభుత్వం కొన్ని నిర్ణయాలు చేయవచ్చును. ... ప్రభుత్వం నిర్ణయాలను ప్రజల ... లాభించలేదు. ప్రజాస్వామిక మైన పద్ధతులలో ... ప్రభుత్వం ..."

### కులతత్వం జాడ్యం

"కులతత్వం ..."

### సగం శక్తి కులవిచారణకు అర్పణ

"ఇతర ప్రజాస్వామిక దేశాలలో ఇలాటి తగాదాలు లేవు. ..."

### మహమ్మదీయ మత విద్వేషం

...

చేత గౌరవింప చేసుకోవలెనని ఆ ప్రబోధాలు స్పష్టం చేస్తున్నాయి."

### పేదరికంపై పోరాటం

"మన ముఖ్య లక్ష్యం పేదరికాన్ని

(3 వ పేజీ 5 కాలం చూడుడు)

## పెద్దల రక్షణలో వచ్చే శంకలు

లండన్, ఏప్రిల్ 21: రష్యా ప్రధాని మార్షల్ బుల్గానిన్‌కు ఎవరో ఒక బంగీ పంపించారు. ఆ బంగీ 'టిక్కు-టిక్కు' అంటోంది. ఇదేదో ప్రమాదకర వస్తువను కొని పోలీసులు ఆ బంగీని నీళ్ళ బాల్చీలో పెట్టేసి ఇసుకతో కప్పేశారు.

కొంత సేపైన తర్వాత ఇసక తీసివేసి చూశారు. 'టిక్కు-టిక్కు' శబ్దం వినబడలేదు.

బంగీ తెరిచి చూస్తే, అది శ్రీ బుల్గానిన్‌కు ఎవరో బహుమతిగా పంపించిన గడియారం.

## సంఘాన్ని వేస్తే సమస్య తీరుతుంది!

ఢిల్లీ, ఏప్రిల్ 21: ఏదైనా సమస్య ఉంటే, దాన్ని విచారించి తగు సిఫార్సులు చేయడానికి ఒక ఉపసంఘాన్ని నియమించమని సభ్యులు కోరుతారు. ...

## బగ్దాద్ కూటం భగ్నమయ్యే స్థితిలో కాశ్మీరు ప్రసక్తి

### పాక్ ప్రధాని వివరణ: ఇతర దేశాల మద్దతు లభిస్తుందనే ఆశ

టెహరన్, ఏప్రిల్ 21: బాగ్దాద్ సైనిక కూటమే భగ్నమై పోతుందని భయపడినందువల్ల కూటంలోని ఇతర రాజ్యాలు పాకిస్తాన్ పట్టుదలకు తలొగ్గి కాశ్మీరు ప్రసక్తి తెచ్చారని పి. టి. ఐ. ప్రత్యేక విలేఖరి తెలియపరుస్తున్నాడు.

కూటంలో ఇతర రాజ్యాలు కాశ్మీరు సమస్యలో తమ పక్షం సమర్థిస్తాయని పాకిస్తాన్ ప్రధాని ఆశపడుతున్న మాట నిజమే కాని, సమర్థించగలరని ఏ ఒక్క దేశమూ స్పష్టంగా మాట ఇవ్వలేదని తెలుస్తోంది.

ఈ సందర్భంలో బాగ్దాద్ కూట సమావేశాలలో జరిగిన వాగ్వివాదాలను బట్టి చూస్తే, చర్చ సమయంలో పాకిస్తాన్ మినహా ఇతర రాజ్యాలన్నీ భారతదేశానికి కోపం తెప్పించరాదనే తాపత్రయం పడిన విషయం బోధపడుతుందని కూటానికి సన్నిహితులైన వకరు చెప్పారు. బాగ్దాద్ కూటంవల్ల పశ్చిమాసియాలో వైరాలు పెరుగుతున్నాయనే భారతదేశం అభిప్రాయాన్ని ఈ కూటానికి చెందిన ఏ దేశమూ ఒప్పుకోదు. కాని పాకిస్తాన్ ఈ కూటాలలో ఎందుకు చేరిందో, అందువల్ల భారతదేశానికెంత దుస్స్థితి కలుగుతుందో ఈ విషయాలలో భారతదేశం వాదాన్ని ఈ దేశాలన్నీ గుర్తించాయి. పాకిస్తాన్ మినహా ఇతర దేశాల ప్రతినిధులందరూ భారతదేశానికి ఆగ్రహం కలిగించకూడదని ఎంతో జాగ్రత్త పడి. ...

## రష్యా కమ్యూనిస్టుల తీర్మానం

### అజయ్ వివరణతో చదవాలని నిర్ణయం

పాల్‌ఘాట్, ఏప్రిల్ 21: పాలక్కాట్ కమ్యూనిస్టుపార్టీ 20 వ మహాసభకు గల విశేష ప్రాధాన్యాన్ని గుర్తించి, ఆ సభ వివరాలను, వారి నిర్ణయాలనూ సమగ్రంగా పరిశీలించవలసిందని భారత కమ్యూనిస్టు పార్టీ జరుపు మహాసభలో దేశంలోని కమ్యూనిస్టు సంఘాలను, సభ్యులనూ, కోరుతూ ఇవాళ తీర్మానం చేశారు.

ఆ మహాసభపై భారత కమ్యూనిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శి శ్రీ అజయ్ ...

## శ్రీ లంక, భారతీయుల పౌరసత్వ సమస్య

### లండన్‌లో కలిసినప్పుడు ప్రధానులు చర్చిస్తారు

కలకత్తా, ఏప్రిల్ 21: శ్రీ లంకలోని పదిలక్షలమంది భారతీయుల పౌరసత్వ సమస్య త్వరలోనే పరిష్కారం కావచ్చనీ, కామన్వెల్తు ప్రధానుల సమావేశం సందర్భంలో లండన్‌లో శ్రీ లంక, భారత ప్రధానులీ సమస్యను చర్చించవచ్చనీ, శ్రీ లంక స్థానిక స్వపరిపాలన మంత్రి శ్రీ అయవీర కురుప్పు చెప్పారు.

...

## ఈజిప్ట్, సౌదీఅరేబియా, యెమెన్‌ల సైనిక సంధి

### ఆర్థిక సాంకేతిక సహకారానికి కూడా ఏర్పాటు

లండన్, ఏప్రిల్ 21: ఈజిప్టు, సౌదీ అరేబియా, యెమెన్ దేశాల అధిపతులు జెద్దాలో ఒక సైనిక ఒడంబడికపై సంతకాలు చేశారని కైరో రేడియో ప్రకటించింది.

సైనిక ఒడంబడిక జరిగినట్లు వచ్చిన అధికార ప్రకటనలో, మూడు దేశాల అధిపతులూ ఆర్థిక, సాంస్కృతిక, సాంకేతిక విజ్ఞానాభివృద్ధిలో సహకారం విషయమై చర్చలు జరిగినట్లు తెలిపారు.

సౌదీఅరేబియా తరఫున రాజా సౌద్, యెమెన్ తరఫున రాజా అహ్మద్, ఈజిప్టు తరఫున ప్రధాని అబ్దుల్ నాజర్ సంతకాలు చేశారని కైరో రేడియో ప్రకటించింది.

సంతకాలైపోయిన తర్వాత ముగ్గురూ అతి ప్రధానమైన సమావేశం జరిపారని కూడా కైరో రేడియో ప్రకటించింది.

...

ఇంతకుముందే ఈజిప్టు సౌదీ అరేబియా సిరియాల మధ్య సైనిక ఒడంబడికలు అమల్లో ఉన్నాయి.

ఈ సైనిక సంధిలో యెమెన్ చేరడంతో ఎర్ర సముద్రంపై అరబ్ రాజ్యాల ఆధిపత్యం బలపడుతుందని ఒక ఈజిప్టు పత్రిక సంపాదకీయం వ్రాసింది.

